శ్రీరామ.

# ఆంధ్రకౌముది.

క. శ్రీభామానస్తోత్రిక, ధామధవనిజమందహాసధామగధగ శ్రీ
శోభితశుభతత్త్వచకుం, భాభోగకిలాస వేంకటాచలవాసా.

వ. అవధరింపుము.

సీసమాలిక.

శ్రీకరమ్ముగను సంస్కృతమునకును బ్రాకృతమునకుఁ గలలక్షణములు చెప్పి
తెలుఁగున నావిధమ్మున లక్షణము చేయ రాకున్ని యదియూ నేరంబు గాదు
తొల్లిటిసుకవుల కెల్లను నను ధన్యుఁ గాఁ జేయుటలఁ పింతె కాని యరుచుఁ
గుకవిజనాజ్ఞానఘోరాంధతమసముఁ బోఁగొట్టఁగల్గు కౌముదివిధాన
నిల మున్ను దెలుఁగున నెవ్వారెఱుంగని యాంధ్రకౌముది యనునట్టికృతిని
సీసమాలిక గాఁగఁ జేసితి నిపు డున్నకవులకు రానున్నకవుల కెల్ల
నుపకారముగ నిది యెపుడు నాచంద్రతారార్కమై కౌముది యటుల వెలయుఁ
గన నిందు సంజ్ఞాప్రకరణము మొదలుగఁ దత్త్వప్రకరణముల్ దనరు వరుసఁ
దత్త్రిలింగపదంబు తద్భవం బనుటచేఁ దెలుఁ గనఁ దగ నట్టితెలుఁగు ప్రాకృ
తాభిధానముగాన నాలక్షణమ్ములు తొలుతఁ గవుల కెల్లఁ దెలియవలయుఁ
దత్సమం బనఁగను దద్భవంబును నాఁగ దేశ్య మనఁగ నచ్చతెనుఁ గనంగ
గ్రామ్యంబు నాఁగను గలవైదు తెలుఁగులు నానిని వివరింతు వరుసతోడ
నది యెట్టు లన విను డబ్జాక్షుఁడు గురుండు గుఱువు వనమ్మును దరువన నిఁకఁ
దద్భవంబులు పొల్చు ధర్మంబు దరమంబు ద్రుహిణుండు దుగిణుఁడు ద్రోహి దోగి
శిఖ సిక లక్ష్మి లచ్చి లఘువు లగువు సముద్రము సంద్రము ముగ్ధ ముగుద
మఃఖము మొకము ధనము దనము ఖని గని గర్వమ్ము గరువము ఘనము గనము
రోషము రోసము రుద్రాక్షమగు రుదురాక దాక్షిణ్యము దాకిణమ్ము
మర్యాద మరియాద కార్యంబు కర్జంబు స్మరుఁడు మరుఁడు నృకేసరి నెఱసరి
కావ్యంబు కబ్బము గంధంబు గందము యక్షులు జక్కులు యశ మసంబు
దీర్ఘిక డిగ్గియ యఘ్ఘ మగ్గువ శుద్ధి సుద్దగు శుక్రుండు సుక్కురుండు [కొమరుఁడు
హర్షమానరుషంబుయముఁకుజముఁడుచంద్రముఁడు చందురుఁడు కుమారుఁడు
భాషయు బాసయూ దోషము దోసము చక్రము జక్కవ సంధ్య సంజ

స్నిగ్ధంబు నిద్దంబు శ్రీ సిరి మతి మది భగ్నంబు బన్నంబు బ్రహ్మ బొమ్మ
ఆజ్ఞప్తి యాణతి యజ్ఞంబు జన్నంబు విఘ్నంబు విన్నంబు విద్య విద్దె
వైరము వెరము భారము బారము స్నానంబు తానంబు ధార దార
ద్యూతము జూదము స్థూలము తోరము స్తంభము కంబము ధాత తాత
భేదంబు బిద్దంబు భిక్షము బికిరము కుబ్జుండు గుజ్జుఁ గులము కొలము
ఆత్మ యాతుమగుఁ బుణ్యంబు పున్నెంబు యత్నము జతనమ్ము రత్నము రతనము
దుర్గ దుగ్గి ద్వయము దోయి దిశ దెసయగా వీర్యంబు బీరంబు పృథివి పుడమి
శయ్య సెజ్జగు బ్రహ్మచారి బొమ్మాచారి రూఢి రూడి యగుఁ జంద్రుఁడు చందు
ఢాలు డాల్ వాలము వాలు ఫలము పాల శల్యుఁడు సెల్లుండు సంఖ్య సంక
గుణము గొనమ్ము దక్షిణము దక్కినము కంఠమ్ము కంటము ఢక్క డక్క విధము
వితము వేశంతము వెంచ ఋక్షము రిక్క విధి విది వీథులు వీదు లనఁగ
దేశ్యము ల్గగు నింక తెంకరి పొత్రిక కఱద లదరులు చక్కటి రవాలు
మక్కువ మొరకువ పొక్కుడు రకణాలు కడిఁది యేడ్తెఱ గొండ్లి కడఁక క్రేసి
కడవస మిన్కిలి వెడ మొగి మొసకంబు పొలకంబు మఱకువ పొరి బిడారు
తివురుట వెన క్రేణి తెఁకువ పూఁ పొగి వీచోపు నివి లలి విన్నఁదనము
పుచ్చడీక ఇలాతి చెచ్చెల పుయిగోట వదరులు మలఁత మొల్లదము తెన్న
క్రచ్చఱ మర ప్రబ్బ యస్పిక యసలారు సూడిద కడిపాయ బోఁకు లులివు
వేనవేలాఁక నెవ్వి గొచ్చె మెదరేసు గొల్లెన యుంగద మొల్లి విసివి
రొహరిసాహరి యుప్పసఁబట్టియ యుఱిముఱి క్రన్నన యాల మలఁతి
యాబిక నిరుకు నయ్యాటంబు నెమ్మోము బమ్మెర కైలాటమ్ము కనుపు
క్రొన్నల నెత్తమ్ము క్రొన్నన వంగుకు క్రిక్కలు వాలాయ మక్కు వాఁక
తక్కటి యేఁకట మొక్కటి బ్రుంగుడు వఱువాత వండలి వంత వఱపు
లగ్గు వల్లియ వెండి యగ్గంబరిది జన్నవలఁకులు చెచ్చెరఁ బొఱుఁడు కరి
పొబె రొడలదొంతి కెబర డెంకణ లుప్పవడం బర రొాల మసలు
కరకరి సిరిరి కలువడం బన్నువ తెమ్మెర రజ్జులు దిమ్మనంగ
తత్సమదేశ్యతద్భవములఁ గలయని తేటనుడుగు లచ్చతెనుఁ గనఁ దగు
నది యెట్లనన:—ఎంక నలరు పేరు కొలంకు నూనెనా నాముదంబానవాలు
బండి వసర మద్దు వండు వవ్వా వ్వవ్వా రాఁక లాకులు సాకు బాఁకు మేకు
గుజ్జు మేఁకర మొండ కోట వెన్నెల కొల్ల గడి పులి నెల వలి మసఁగన నిఁక

గ్రామ్యాలజాలు పురాణాలు దోషాలు శాస్త్రాలు వేదాలు సాంబరాలు
గంతులు పొక్కులు గ్రద్దలు బొందలు గానాలు మొదలుగాఁ గల పదములు
వాసేవు పైన్లు రాగేసేవు సీవూను కూపుకుంటా గొంతి గద్దరాకు
పాడేవు ఆలెత్తి యాడేవు వస్తానె సూసేవు దాని కంతానవిరాకె
నను క్రియ ల్లోదలైన యవి గ్రామ్యములగు నిట్టిం తెగకు నెక నగవుతజేఁ దగు
నరవిగ దీనను సంజ్ఞాప్రకరణంబు వివరింతుఁ గలదంత కవులు వినుఁడి
అదులు స్వరములు వచ్చు లనఁగ నొప్పుఁ గాదులు హల్వ్య జనాఖ్యలఁ దగుఁ
రహి, అకారము కవర్గము హకారము విసర్గలు కంఠభవములై నలువుగాంచుఁ
గన, ఇకారము చవర్గము యకారశకారములు తాలుభవములై యలరుమిగుల
నిఁక, ఉత్వము పవర్గ మిఁకలు నోష్ఠభవములు దంతోష్ఠభవము వకార
మొగి ఋటురషములుటిగుమూర్ధభవములై యగు ౡతులసలుదంత్యములనంగఁ
గన నేత్వ మైత్వంబుఁ గంఠతాలవ్యంబు లోత్వ మౌత్వంబు కంఠోష్ఠ్యము లగు
నరయంగ యరలవ లంతస్థ లనఁ బొల్చు శషసహ లూష్మాఖ్యఁ జనును మఱి ఙ
ఞమణన లనునాసికములునౌ ఁ ఃకలిఃప లిఁ జిహ్వామూలభవమనంగఁ
నలయుపధ్మానీయ మనఁ దగు నీరెండు తెలుఁగు పదములలోఁ బలఁగలవిఁక
నవల నజంతహలంతసంధులన సంధులు ద్వివిధంబులై వెలయు నందు
లజంతసంధి మెట్లన వినుం డాదిశబ్దాంతవర్ణంబు తదగ్రశబ్ద
(పూర్వ)వర్ణంబుతోఁ బొందునందిన సంధి యగు దీని కింక లక్ష్యము లొనర్తు
నచ్చుపై నచ్చున్న నది యకారం బగు నెంతయమ్మా యింతి యివియన మఱి
యాదంత మీదంత మూదంతముల మీఁద నచ్చున్ననుయకార మగునదివినుఁ
డానవాలాయిల్లు మానిసీర్యొక్కరుం డిందూ యనుచు వేఁడె నిందన నిఁక
నవలనిదంతము (లయి)నట్టిక్రియలకుఁ దగు కిమప్పికి నుదంతంబులకును
పైనచ్చు గల్గినఁ బవరూప మంతట నిత్యంబుగా వచ్చి నెగడుఁ గృతులఁ
గంటి కివెల్లను ఘనున కిచ్చి రనంగ శి (ఖరిణి) కెంతహర్షించి రనఁగఁ
దగిన తనకుదారధర్మపాలనలీల యనఁగఁ ద్రేతాగ్ని శేమయ్యొనాఁగ
నలయు దంతములకే యచ్చు పైనుండినఁ బరరూప మొక్కచోఁ బరఁగునంద్రు
ము నికినకుడిగ గంగినకాసె చెప్పాప్పె వహిమెట్టి వెంతొరు లహియనమఱి
యాపరరూపంబె యగు నిదంతముఁ క్కొాకిడలఁ జేతిది చేతియిది యనంగ
సకలప్రబంధంబులందలిలక్ష్యము క్వాక్వాల యొకకొన్ని విస్తరింతు

నన్మెచ్చె నాఁగను దమ్మంట్లు నాఁగను దిప్పెంత యనఁగ మదించె ననఁగ
వానిదవంధ్యజీవన మనంగ ననలజ్యోత్యుండ నన నిచ్చుచుండు ననఁగ
నంతం తనఁగఁ బరమార్థంబు రనఁ దామరసనేత్రలిండ్లన బ్రహ్మోత్కఁడన
శౌరిచ్చు భక్తి వేసారక యెంతధికంబైన గురునాజ్ఞ గనుఁగొన నన
మీరివ్వ డ ద యొమ్మికను లొత్తిది యన నేయు మేయు మన నేయేయనంగ
వెలయుచునుండు నిట్విధముగ నిఁక హలంతసంధులు కొన్ని యమర వినుఁడి
అఖిలశబ్దాంతక్రియాంతనకారము ల్నిలుచును బై నచ్చు గలుగు నెడలఁ
గలుగనియెడలఁ బై కచటతపలు గల్గ నవి గజడదబలై యానకార
ములు సున్నలగుచుఁ బొల్పుగఁ దగు నీవైదు వర్ణము ల్గాకను బైని వేఱ
హల్లున్నఁ జరు వచ్చు నల్లనకారము వరుస నీనికి నుదాహరణ లెన్న
రిపు నోర్చె బహుమతి నృపుచేతఁగంటివి నీకంటెఁ జతురుండు నీకుఁ దరము
నీకెన్నఁ బ్రతియు భూలోకాన లేఁ డౌర కవుల రమ్మని వేడుకన్వచింతు
వస్తులవీక్షింతు వనని నీవనముల నింతువనఁగ నిట్లు నెగడు నింక
రహిఁ గ్రియ లుప్తవర్ణపదసంధులు గల తెలుఁగులు కొన్నింటిఁ దేటపఱుతు
నచ్చు తెన్గునుడుల నంత్యములగు డు రునులులు నడుమను గడలఁ దగిలెడి
తఱిని వానఁగల యుత్వము నిల్వఁ బోవును వ ల్లులుపై నున్న నది యెటులన
నీడురాజులనంగ నీడ్రాజు లనఁ దోడు గలిగె ననంగఁ దోడ్గలిగె ననఁగ
నూఱుఁగాయ యనంగ నూర్గాయ యన జాఱుఁగొప్పనా నిడుద జార్గొప్పనంగఁ
గనువండుగ యనంగఁ గన్పండుగన పినువాఁక యనంగ పిన్వాక యనఁగ
వాలుమించులునాఁగ వాల్మించులన మేలుకని నన మేల్కని ననఁ దగు మఱి
యొక పేరఁగూర్చి పలుకుచో డుపురుతులఁగల యుత్వమట్టుల నిలుచుఁ బోవు
గాడుపు గాడ్పనఁ గడుపు కడ్పన నొప్పు నప్పు డప్పన నిట్టు లమరుచుండు
నేరుపు నాఁగను నేర్పనాఁ దనరు నెత్తురనంగ నెత్రునాఁ బరఁగు మఱియు
నులులపై నుత్వ మట్టుల నడుమఁ దగుఁగడనులుల యుత్వ మట్ల తగదెందు
కానుపు కాన్పనాఁ గనుము కన్మన నొప్పుఁ గలను చదలన నీగతిఁ దగునిఁకఁ
బరికింపఁ బూర్వప్రబంధప్రయోగము ల్వివరింతు నొకకొన్ని వినుఁడు తెలియ
నట్టంతములకు వ్యత్యయమా నిట్టంతముల కట్ల కూరిచి పలుకుతఱిని
అగడి తగ డ్త పొగడిత పొగడ్తనా గిలకి గ్లిలయనంగ మొలక మొల్క

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.*

(ప్రథమభాగము)

ప్రథమాశ్వాసము.

—౹ కృత్యాది, దేవతాస్తోత్రాదికము ౹—

శా. శ్రీమత్పర్వతనందనా[1]తనులతాశ్లిష్టాంగ మై బాహుశా
ఖామధ్యంబున నున్నపన్నగఫణాఘం బాను లై యొప్ప ను
ద్దామం బౌ శశికాంతి పుష్పరుచి నొందంగా జటాపల్లవ
స్తోమం బౌ హరపారిజాతము నుతింతు[2] న్వాక్ఫలావాప్తికిన్. ౧

చ. పులుఁగులపెద్ద వారువము, పోటరి బిడ్డఁడు, రాఁగరాతు౹, పా
ములగమికాఁకు సెజ్జ, నలుమోములవాఁ డిలుతీర్పుకట్టె, వే
ల్పులు బలుబంటు, లాకముల[3] పొల్తుక, తెల్లనితల్లి పెద్దకో
డలనుచు నెల్లవారుఁ బొగడం దగు నల్లనివేల్పుఁ గొల్చెదన్. ౨

ఉ. దక్షిణనేత్రకాంతి నుచితంబుగ నర్థవికాస మొంది వా
మాక్షిరుచిప్రసారమున నర్థము విప్పక యున్న పుండరీ
కాక్షుని నాభిపద్మనిలయంబునఁ దుమ్మెదభంగి లోలుఁడై
యక్షయవేదనాదమయుఁ డైన విరించిఁ దలంచి మ్రొక్కెదన్. 3

ఉ. కట్టినపుట్టముం దనువు గద్దియుతమ్మియు నక్షమాలయుం
బట్టినచిల్కయు న్నగవుఁ బాపటజల్లియు నొక్కవన్నెగాఁ
బుట్టుచుఁ బుట్టువిద్యలకుఁ బుట్టినయిల్లనఁ జెల్లి బ్రహ్మవా
కట్టొనరించి తన్ముఖవికాసినియౌ సతి మమ్ముఁ గావుతన్. ౪

ఉ. నిద్దము లైన భూషణమణిప్రకరద్యుతు లన్నిదిక్కులన్
దొద్దలువుచ్చి తల్లిచను దోయిసరిం[4] దలకట్టు మించఁగా
ముద్దులు సూపుచుం బసిఁడిముద్దగతిం దొడమీఁద నాడు నా
ముద్దుగణేశునిం దలఁచి మ్రొక్కెద నీకృతికార్యసిద్ధికిన్. ౫

క. రుణ్మదపరివృఢసురగణ, తృణ్మోచను సురశరణ్యు ధృతశక్తి ఫణి
ద్విణ్మయువాహను, [5]హరనిభు, షణ్ముఖు నభిముఖునిగాఁ[6] బ్రశంసింతుమదిన్.

---

*సింహాసనద్వాత్రింశతియనియుం గలదు 1. నందినీ. 2. భజింతున్. ౹రాగరాతు, రాగకాతు. 3. లాల్కలిమిపొల్తుక. 4. నడిం. 5. హరికిప్రియు, హరిప్రియు, హరిసఖుఁడు. 6. నతిసుముఖుంగా,

ప్రవిమలుఁ డని గ్రహరాజని, కవితాప్రియుఁ డని జగత్ప్రకాశకుఁడనియున్
భువివిక్రమార్క నృపసంభవ కారణుఁ డనియు[1] లోక బాంధవుఁ దలఁతున్.
పులుఁగునకై యెవ్వనిమది, నొలికిన శోకము లకారయుతమై కవితా
కలనకుఁ దెరువయ్యెఁ దలం, పుల నాతని గొల్తుఁ బుట్టఁ బుట్టిన సుకవిన్. ౮

శ్రీనిలయంబునాఁగ మురజిద్గుణరత్ననివాసమై యుపా
ఖ్యానతరంగిణీభరితమై కడగానఁగరాని భారతా
ఖ్యానపయోధిలోనఁ గలమై నిజయుక్తి భజింపఁ గర్ణధా
రానుకృతిం గృతార్థత మహాఘనుఁ డా మునిఁ బ్రస్తుతించెదన్. ౯

ఆ భారతపర్వత్రయ, మీ భారతివర్ష మెల్ల నెఱుఁగఁ దెనుఁగునన్
శ్రీ భారతిగతిఁ జెప్పిన, నాభావుకమును[2] దలంతు నన్నయభట్టున్. ౧౦

వేముల వాడక శుచియై, [3]వేములవాడం జరించు వేములవాడం
దా మెఱసిన భీముని నుత, భీముని బలభీము విమతభీమునిఁ దలఁతున్. ౧౧

అనఘు హుళక్కి భాస్కరు, మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును, ఘను నాగరాజుఁ, గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ, గే
తనకవి, రంగనాథు, నుచితజ్ఞుని నెల్లన, నాచిరాజుసో
మన, పరమేశ్వరుం, దలఁతు మత్తులచంద్రుల సత్కవీంద్రులన్. ౧౨

అని యిట్లు సకలవరప్రదానకారణదేవతల ను జతురవాగ్విద్యానపద్యగద్య పద్యవిద్యావిద్యోతితు లయిన కవీశ్వరుల నుం బ్రశంసించి తెల్పి పాదానా దితిపవిజనసాహిత్యతరంగితాంతరంగుండనై సకలజనసాధారణం బగు నట్టి ట్లని విన్నవించెద.[4] ౧౩

ఆదరణంబు లేక చెడనాడిన బాణమయూరకాళిదా
సాదులకైనఁ దప్పు గల దన్యుల కేమని చెప్ప వినితో
నేదియుఁ గాదు పొమ్మనక యిందులచంద మెఱింగి తప్పినం
గా దని తీర్చి యొప్పు గని కైకొని పెద్దరు గాక సత్కవుల్. ౧౪

[5]మానుగఁ దప్పులున్న సనుమానము సేయక మోదమానస
స్థానసులైనవారు కలుమా ఋపరీక్ష [6]లోనచ్చి తీర్చినన్

1. కారణమనియు. 2. నాభిరతుఁడని, నాభావకుఁడని 3. వే, వే, యని రెండుప్రతుల నురీతులు (వేములవాడ, వేములవాడ). 4. విరచించెద, వినిపించెద. 5. మానము దప్పనీక. 6. లోనచ్చి తేరినయున్.

హీనకవిత్వ మైన మెఱుఁ గెక్కదె నేర్పరులైనవారిచే[1]
సానలఁబట్టి తీర్చినను సన్నపురత్నము వన్నెకెక్కదే. ౧౫

ఉ. భావరసానుకూలమృదుపాకపదార్థసమృద్ధి లోకసం
భావన నొప్పుకావ్యముల పద్దము[2] గావఁగ లేక మూర్ఖతుల్
కావనఁ గాని మొట్టికడఁ గట్టిడిఁ జెప్పఁగనేర, రల్లడం
ద్రోవన కాక కుక్కలకు దొంతులు వేర్వఁగ నేర్పు గల్గునే. ౧౬

చ. చులుకని పద్య మైనఁ గనుఁ జోద్యము చేయుదుఁ జిన్నవానిఁ బె
ద్దలు గొనియాడఁగాను విని తప్పులు పట్టఁదలంతు రజ్ఞులుల్
బిలిబిలి మాట లాడఁ దనుఁ బెంచినవానికి ముద్దుగాక యా
పలికెడు చిల్లపిల్లఁ గని బావురుఁబిల్లలు[3] సంతసిల్లునే. ౧౭

ఉ. భీమనభట్ట మన్నఁ గడు భీతి వహించుచు మేలుమేలు నా
నే మిది చెప్పినార మన నిక్కమె ప్రాపము కూర్చినాఁడ వౌ
నే మిది కాదు దీనిపడి కెక్కడి కర్థ మిదెట్టి దీగణం
బే మని పెట్టినాఁడ వని మొక్కలుపట్టఁగ బుద్ధి పెద్దలన్. ౧౮

క. వివరికి వివరించిన కృతి, చవిపాలా బాచదార సరి కూర్చుట[4] యా
యవివేకికి వినిపించిన, కవిత వఱుతెఁ జాతపంచు గలుపుట చుమ్మా. ౧౯

ఉ. పూనిపరీతి వానితలఁపు లప్పడిఁ బ్రానములుం జలంబునం
బూనగిలంగ సీడ్చి యొకపద్యముఁ గూర్చఁగవచ్చుఁగాక యా
ఖ్యానకథానుకూలముగఁ గావ్యముఁ జెప్ప వశంబె పన్నెగు
కానఁగ జల్లి నేయునది కట్టెకుప్పము నేయనేర్చునే. ౨౦

క. ఉర్విఁ గలశబ్దజాలము, నిర్వచనస్థితుల నెఱిఁగి నేర్చిన విద్యా
నిర్వాహకుఁ డనఁజెల్లును, సర్వజ్ఞుఁడు గానివాఁడు సత్కవి యగునే. ౨౧

క. ఎప్పటి కేయది ప్రస్తుత, మప్పటి కావిద్య మహిమ[5] మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము, దొప్పునె కావ్య మంత సులభమె ధాత్రిన్. ౨౨

క. దుర్వాదము గాకుండ న, పూర్వపుఁగృతిఁ జెప్పుకవిపుంగవునకుఁ దా
సర్వజ్ఞుఁడ నని మాటల, గర్వింపఁగనేల తొడవు గానంబడఁగన్. ౨౩

క. చనుఁ "గవివైభవవిద్యా" యని చదువుటఁ గావ్య మధిక మదియును నల్లి
ల్లును గుడియుఁ జెఱువునిధియును, వనము సుతుఁడు సంతతులుభవస్థితిగతికిన్

1. నేర్పరులైనవోజులై. 2. పద్ధతి. 3. బావురుఁబిల్లులు. 4. కూర్చుమనా. 5. మర్మము
చ్చ...జెప్పెడు.

ఎవ్వరు కృతు లొనరింపుదు, రెవ్వరు కృతిలోన వినుతి కెక్కుదు రారుచే
నవిద్యమల[1] కీర్తి సంతతు, లివ్వసుమతిఁ జెడక నిలుచు నవికల్పముగన్.

సుగుణులు "బాణోచ్ఛిష్టం, జగత్త్రయ" మ్మనఁగఁ గొంత చదువఁగఁ బ్రియమే
తగఁ దోఁడంటిన[2] పాలిం, పుగఁ బెరుఁగయియున్న నది యభోజ్యంబగునే.

సంబంధము లగు రసభా,వంబులు మునుకంటె నభినవంబులు గలవే
యంబుధి నెకాళ బహురత్నంబులు రత్నకుల కేమి లాఁ బండినవే. ౨౭

తల్లి యగు వాణికరుణం, దొల్లిటికవు లధికు లనఁగఁ దోఁచిరి పిదపన్
బల్లిదు లిప్పటిసుకవులు, తల్లికిఁ గడగొట్టు[3] కొడుకు దాఁ బ్రియమగుటన్.

ఏజనుల కైన సద్గుణ,యోజితులై భావ మెఱిఁగి యుచితార్థకళా
రాజితు లగు కవిరాజుల, రాజులు చేపట్టరేని రాజ్యము గాదే. ౨౯

సరసులు చేపట్టినచో, విరసం బగుకావ్య మైన వినిపించిన నా
దరణీయం బయి వెలయదె, ధరఁ బుష్పాలఁ దాల్చి తుంగ[4]తలకెక్కఁగదే.

అప్పరమేశ్వరు కరుణం, గుప్పలు గొను విక్రమార్కు గుణముల కొఱకై
చెప్పెద రసభావంబులు, ముప్పిరిగొనునట్లు కథలు ముప్పదిరెండున్.

తెనుఁగున దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మె
త్తన వస చాల దంద్రు విశదంబుగ సంస్కృతశబ్దమూఁదఁ జె
ప్పిన నవి దర్భముండ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగుదేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్. ౩౧

వదలముగ మృదులవచనా,స్పదపదసంపదల రసము వదలక మహా
పదముల నైనను జల్లులఁ, బోదుపెట్టిన దుడుకుఁగవిత[5] పొదలు నెసఫలన్.

తనవచోవిశేష మెనయక పూర్వక,ధామితోక్తిఁ జెప్పు టేమికడిఁది
యొకఁడు గోలపట్టి యొయ్యనఁ గొనిపోవ,నంధుఁ డెచటికైన నరుగుటరుదె.

ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్ల వీఁడు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
నేసిన నందె పాఱ మఱి యేసినవానిద సూటిగావునన్. ౩౩

తెలుఁగున కెల్లఁ దల్లి యగుఁ దెల్లము సంస్కృతభాష యందులోఁ
బలుకు లెఱుంగుచోఁ బదవిభాగము సన్వయ మర్థమంచు నీ

1 నవ్యభుల. 2 తోడంటునఁటా. 3 గడపుట్టు 4 శంకరుంగ. 5 దుండుకవిత.

మలకలకంటె నందుల సమస్తము దేటతెనుంగ యొప్పు నా
కొలఁది ప్రియంబు గాదె చెఱకు ల్దినుకంటె ఘనంబు ప్రోలినన్. ౩౭

క. పురమథుజటాలీలాంబుధి, పరిణయనయవిప్రలంభపతిగుణపుశభా
స్కరచంద్రోదయరణగతి, గిరివనదూతస్తురతులఁ గృతి చెప్పఁదగున్.

క. కావునఁ బను నెనిమిది యగు, సీవర్ణన లచటనచట నించుక బెరయం
గావించెద నిటఁ బని కిఁక, రావనకుఁడు లక్షణాభిరామము లగుటన్[1].

వ. అని విన్నవించి కృతకృత్యుండ నై సింహాసనద్వాత్రింశతి కథాకథనమూల
కారణం బైన యంబికారమణుండు ను [2]ముక్తివితానసంపత్తి సంధాయకుం
డగు లక్ష్మీనాయకుండును గావ్యనాయకులుగా నియమించుటం జేసి. ౩౮

సీ. పాఁపపెండెముగాఁ గసిఁడియందియ మునునడుగుఁదామరలపై నమరువాఁడు
పెద్దమెకముతోలు నిద్దంపుఁబట్టను మొలదిండుగాఁ గట్టి మురియువాఁడు
ఎముకపూసలును ముత్యములుఁ జేరులు గాఁగ సక్కునఁ దాల్చి పెంపెక్కువాఁడు
పునుకయుం బెరుగుల్ల యును గేలందమ్ముల నంచలర్చాప్తిఁ బాటించువాఁడు
నగముపొడవునఁ దెల్పు నానగము నల్పు
నయ్యు నెడ న్యాకవన్నియ యగుచు మేను
లెనయ మ్ముక్కంటియును వెన్నుఁడును ననంగఁ
బొల్పు నావేల్పు కబ్బంబుఁ బ్రోచుఁగాత. ౪౦

—॥కవివంశావతారవర్ణనము॥—

క. తత్పదపద్మారాధన, తత్పరులను రాజమంత్రిధర్మజ్ఞుల మా
సత్పురుషుల వినిపించెద, మత్పారంపర్య మొక క్రమంబునఁ దెలియన్.

సీ. కలువమండలికభేకఫణీంద్రుఁ డన రాయగజగంధవారణఖ్యాతి మెఱసి
వీరఘోట్టవిభాళుఁ డాహూఢబిరుదవిరోధి కళింగవిరోధి యనఁగ
వెలసి నానాఁటికి వెలనాఁటి పృథివీశ్వరుని రాజ్యభారధుర్యుం డనంగ
నారెలు గన్నడీ లఱవలుఁ దెలుఁగులుఁ దనబిరుదందియఁ దగిలికొలువ
నెగడి ననదప్రోలు[3] నెలవుగా భూసుర,వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తిమాన్యసౌజన్యధన్యుండు, విక్రమార్కవిభుఁడు వెన్నవిభుఁడు.

ఉ. సాంద్రజవంబున,[4] న్నతి, నిజస్థితి, నేర్పునఁ, బేర్మి, సత్యవృ
త్తిం, ద్రుతబాణ[5]పాతనిరతిం, గళల, న్నరివత్తు రెల్లు వ

---

1. పెంపరయన్, మెరయన్. 2. ముక్తివితానసంపద్విధాయకుండు. 3. నందప్రోలు, 4. సాంద్రబలంబున. 5. దృఢబాణ.

శ్రీంద్రుఁడుఁ బన్నగేంద్రుఁడు నగేంద్రుఁ డుపేంద్రుఁడు నింద్రుఁడున్ హరి
శ్చంద్రుఁడు రామచంద్రుఁడును జంద్రుఁడు వెన్నయ మంత్రిచంద్రుతోఁ[1]

క. అమరంగ వెన్నయమంత్రికి, సమితకళాకీర్తిపాత్రుఁ డగుపుత్రుం డై
యమరేశ్వరమంత్రివిభుం, డమరేశ్వరమంత్రి వెలసె నార్యులు వొగడన్.

క. [2]సంగతి నమరేశ్వరునకు, గంగాంబకుఁ బుట్టి రట్టి ఘనులన్నయయున్
సింగయమంత్రియుఁ దమలో, నంగీకృతరామలక్ష్మణాకారములన్. ౪౬

ఉ. అన్నయనామధేయసచివాగ్రణి పుత్రుఁడు పెద్దిరాజు సం
పన్నిధి [3]పల్లికొండజనపాలుఁడు మల్లనదేవరాజుచే
నెన్నఁగఁ గుంచె లందలము నెల్లియుఁ గైకొని మంత్రియై ప్రతా
పోన్నతి శక్తి ధర్మముల నొప్పెను బ్రహ్మసమప్రతిష్ఠలన్. ౪౭

చ. అనఘులు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి సత్తినా
రన యనఁ గల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసాంద్రుఁడు సింగనయుం గ్రమంబునన్. ౪౮

క. ఘను లగ్రజులకు నీడై, వనములుఁ గ్రతువులును గృతులు వడి నిల్పిరి బా
చనయును సింగనయును దగి, రనపోతకుమారసింగయకు మంత్రులనన్.

క. రామాయణకృతికృతియై[4], తా మెఱయుచు సంధ్రకవిపితామహుఁ డనఁగా
భూమిని మించినభీమన, నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై.[5] ౪౯

ఉ. నారన కగ్రజుండు సుగుణజ్ఞుఁడు గంగనసింగమంత్రి కిం
గూరిమిపట్టి నాఁ బరఁగు గోపయమంత్రి నిజానువృత్తిఁ బెం
పారెను నెల్లమాంబిక కులాంగనగా నతిశక్తిఁ దారతా
రారుచికీర్తి యాకసవరాజుతనూజుఁడు దాఁ బ్రసిద్ధుఁడై. ౫౦

వ. ఇట్లు గోపరాజతనూజుండైన కసవరాజు దానగుణ రాధేయుం డగు రాణా
మల్లనరేంద్రునకుఁ బరమగురుండై శైవాచారప్రథమసింహాసనాధీశ్వరులైన
[6]బ్రహ్మదేవరయొడయుల కూఁతు కామాంబిక యను కామినీరత్నంబుఁ బరి
గ్రహించి సుగుణగణగణ్యుం డై నెగడె. ౫౧

ఉ. స్థేయుఁడు మంత్రిలక్షణవిధేయుఁడు లాలితదానకేళి రా
ధేయుఁడు సర్వసజ్జనవిధేయుఁడు సంతతసత్యవాక్యకాం

---

1. చంద్రునకున్, 2. గంగాంబకుఁ బుట్టిరి భువి, నంగజసన్నిభులు ఘనులు అన్నయయు సింగయ మంత్రియు, 3. పల్లకొండ గుణసంగుఁడు సింగనయుం బ్రియంబునన్. 4. రామాయణకృతిపతియై, 5. కవియై, 6. బ్రహ్మదేవవడియలు.

తేయుఁడు నిత్యకీర్తి సుదతీపతిఁ జేయుఁడు భావశుద్ధి గాం
గేయుఁడు గాయకప్రకరగేయుఁ డమేయుఁ డజేయుఁ డున్నతిన్. ౫౪

సీ. ప్రకటితసరసవాక్ప్రతి యనఁగాఁ జెల్లి చతురాస్యుఁడై పద్మజన్ముఁ డనఁగ
నార్యానుకూలహితాకార్యంబు దీర్చుచు సర్వజ్ఞుఁడై మహేశ్వరుఁ డనంగఁ
గామాంబఁ దనపత్నిగా గారవించుచుఁ బురుషోత్తముండయి హరి యనంగ
గోపకుమారుండు కొడుకుగా నక్రూరదృఢమిత్రుఁడై వాసుదేవుఁ డనఁగ
వేముగల్లు జన్మభూమిగాఁ జెలఁగియు, [1]దీవులెల్ల మాటఁ దేటపఱిచి
హరిపదైకబుద్ధి హరితగోత్రాంబుధి, రాజసింగఁ గసవరాజు మించె

క. తంత్రముచేఁ గార్యము పర, తంత్రము గాకుండఁ బతిహితము చేయుమహా
మాత్యులలోపలఁ గసవయ, మంత్రి విచారమున దిగ్జయమంత్రియుఁ బోలెన్.

వ. ఇట్టి మంత్రిశిరోమణికి నుసికిపట్టగునట్టి పట్టణం బెట్టిదనిన. ౫౫

శా. రాణామల్లనకీర్తిచంద్రికలు పర్వం బొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్వనదుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి య[2]
క్షీణశ్రీపురుషోత్తమాశ్రయము నై చెల్వారి దానామృత
శ్రేణిం ద్యాగసముద్రనామము వహించె న్వేముగ ల్లిమహిన్. ౫౬

వ. అట్టి పురంబునందు. ౫౭

క. పూజితులగు కవులకృపన్, భ్రాజిష్ణుఁడఁ గొంత [3]యాంధ్రభాషావిదుఁడన్
రాజనుతుఁ డైన కసవయ, రాజతనూభవుఁడ గోపరాజను వాఁడన్. ౫౮

శా. చిత్రఖ్యాతి [4]వితీర్ణవిక్రమనిధి శ్రీవిక్రమాదిత్య చా
రిత్రఖ్యాపనశాసనంబులకు భూరిస్తంభసంభారమై
ధాత్రీపాలురఁ గావ్యవేదులను మోదం బంద సింహాసన
ద్వాత్రింశత్కథల న్గుణంబులుగఁ గావ్యం బొప్పఁగాఁ జెప్పెదన్. ౫౯

వ. అది యెట్టిదనిన. ౬౦

—॥ కథాప్రారంభము ॥—

ఉ. సారబలప్రతాపపరిశంసితవింశతిబాహుబాహుకే
యూరచిరత్నరత్ననికరోపలమా రజతాద్రి పై మనో
హారవిహారము ల్సలిపి యచ్చట నచ్చట విశ్రమించుచుం
జారువిచారుఁ గింకరవశంకరు శంకరుఁ గౌరి యిట్లనున్. ౬౧

---

1. మేటిన్పవులమాటగీటుపఱచి 2. యీ క్షోణిక శ్రీపుర...శోభిల్లి. 3. యష్టభాషావిదుఁడన్ 4. వికీర్ణవిక్రమ.

క. చిత్తజహర యీవలనం, బ్రొత్తకథ ల్గలిగెనేని గోరి వినంగాఁ
జిత్తం బుత్తలపడియెడి, నిత్తఱిఁ బ్రొద్దుపుత్త మెఱిఁగింపఁగదే. ౬౨
క. నావుడు దేవుం డిట్లను, దేవి కల వెల్ల నీకుఁ దెలిపితి మొదలన్
దేవాసురమానవముల, నీవెఱుఁగనియట్టికథలు నేఁ డిఁక నేవీ! ౬౩
క. ఇప్పటికి భోజునకుఁ గడు, నొప్పిద మగు మణిమయాసనోపాంతములన్
ముప్పదియు రెండుబొమ్మలు, చెప్పిన యాకథలు గలవు చెప్పెద వినుమా.
క. అనవుడు నామణిసింహా,సన మెవ్వరిసొమ్ము భోజజనపతి కేలా
గునఁ జేరె నేమికారణ, మున నతనికి నిన్నికథలు బొమ్మలు సెప్పెన్ ౬౫
క. నాకుం జెప్పఁడు నావుడు, నాకైలాసంబుపై సుఖాసీనుం డై
యేకతమునఁ గథ లన్నియు, శ్రీకంఠుఁడు గౌరి కిట్లు చెప్పఁదొడఁగెన్.
సీ. కాంచనకుంభసంగతశృంగములు గలమేడలు గడకట్టు మేరు వనఁగ
రామణీయకగుణారామంబులైన మందిరములు తిరములౌ పురము లనఁగఁ
గట్టాయితం బైన కట్టడ గలకోటపుట్ట యాచెలియలికట్ట యనఁగఁ
గడ గాన రాక భీకరమకరాలయం బైనయగడ్త మహాబ్ధి యనఁగ
మించి భూమండలంబు నిర్మించువేళఁ, దెలివిపడ బ్రహ్మపడియచ్చు దెచ్చుకొన్న
ద్వీప మనఁ జెల్లు బహురత్నదీవ్యమాన, గోపురంబుల నుజ్జయినీపురంబు.
క. ఏకడఁ జూచిన రత్నా,వ్యాకీర్ణము లై వెలుంగు నవ్వీటి గృహ
ప్రాకారంబుల మహిమను, జీఁకటియును జొరకులమఁ జేరఁగనోడున్.
క. కోట నొకచోట మరకత,కూటముఁ దృణ మనుచు సిలిచి కోమటియిండ్లం
గోటికి నెత్తినపడగల, యాటునకై యుళికి పాఱు నర్కుని హయముల్.
ఉ. ఖంబినగాలిచేరుల నభఃస్థలి త్రొక్కడదండెసేసి నా
కంబు మహీతలంబుఁ గుడుక బ్రచియించి విరించి తొలి తు
ల్యంబుగ నెత్తుచోఁ జులుకనై యమరావతి మీఁది కేగె న
త్త్యంబున నెక్కుడై యట నవంతిపురం బది వ్రాలెఁ గ్రిందికిన్. ౭౦
క. క్రిందయ్యును నమరావతిఁ, గ్రిందుపఱుచు ననుచుఁ గవులు కీర్తింప మహీ
బృందారకవరులకు నా, నందంబుగ నయ్యవంతినగరం బొప్పున్. ౭౧
ఉ. జాగులు లేక యిచ్చు నెఱచాగులుఁ, నంచితకీర్తి సంచయో
ద్యోగులుఁ, శాశ్వతసదభియోగులుఁ, గల్పితయాగులు, న్సుగా
రాగులు, వీతరాగులు, నిరస్తవిరోధి కృతానురాగులున్
భోగులు, సర్వభాగులును, బుణ్యనియోగులుఁ దత్పురీజనుల్. ౭౨

వ. ఇట్లు విధంబున సత్తాపసోత్తములం బూజించి యద్దశరథేశ్వరుండు కృతాంజలియై తత్ప్రసాదంబు గోరి యున్నయెడ ౧౨౭

సీ. శ్రీరస్తు జయోస్తు చిరకీర్తిరస్తు తే శత్రుక్షయోస్తు సతౌఖ్య మస్తు
మందిరం తవ రమాసుందరం భవతు భద్రాణి భవంతు సుధర్మ మస్తు
పద్మగర్భస్యైవ పరమాయురస్తు దేవబ్రాహ్మణే వ్వతిభక్తి రస్తు
భగవత్ప్రసాదోస్తు బహుధన మస్తు మాతంగతురంగశతాంగమస్తు
సపది పూర్ణమనోరథాస్సన్తు సత్య, మస్తు చతురాత్మజావాప్తి రస్తటంచు
మునులు దీవించి సేస లమ్మనుజపతికి, నెలమితో నిడ నాతఁ డొందలధరించె.

వ. అసమయంబున నమ్మునీంద్రు లన్నరేంద్రుం జూచి. ౧౨౮

క. జననాయక మము రప్పిం, చినకార్యముఁ జెప్పు మన్నఁ జెలఁగుచు వారిం
గని యిట్లను మునులారా, ఘనకృప నను జూచి మనవి గైకొనుఁడింక.

క. నిస్తులనిగమఘనాగమ, పుస్తకములు చదువు బుధు "లపుత్రస్యగతి
ర్నాస్తి" యని వచింపుదు రది, వాస్తవ మగుఁ గాదె శిష్యవత్సలులారా!

వ. కావున. ౧౩౦

గీ. అశ్వమేధంబుగావించియనఘులైన, యాత్మజులనొందఁగోరిమీయనుమతంబు
వలన నది సేయఁదగునని తలఁచిమిమ్ముఁ, బిలువనంపితి నేనతి ప్రియముతోడ.

మ. అనిన న్వారలు సంతసిల్లి విన నీ యాగంబు గావింపు మో
మనుజాధీశ్వర భూరితేజులు సుధీమాన్యు లునతు ల్నీకుఁ జ
య్యన జన్మింతురు మా సరస్వతు లమోఘార్థంబు లింతైన నీ
వనుమానింపకు మాకు సత్యవచనవ్యాఖ్యానము ల్బ్రొంకుశే. ౧౩౨

క. అనుచు వసిష్ఠాదులు ప్రియ, మునఁ బలికినసుడులు వినుచు భూవరుఁ డపుడే
తనయులఁ గన్నవిధంబున, మనమున హర్షించి పలికె మంత్రులతోడన్ ౧౩౩

గీ. సచివవరులార! నేఁడు నిశ్చయముగావ, సిష్ఠుఁ డాదిగఁ గలమునిశ్రేష్ఠు లెల్ల
బహుళకరుణాంతరంగులై పలికినట్టి, వచనములు మీరలునువిన్న వారుగాదె.

సీ. కావున మీరు వేగంబ నేఁ జేయుతురంగమేధాఖ్యాధ్వరంబునకును
వలయు యూపాదిసద్వస్తువు లమకూర్చి సరియూత్తిరస్థలి సవనవాట
మొనరింపుఁ డని వారి మునులను పిల్పొల్పి సరగ నాతం డంతిపురమునకును
జని యందు విలసిల్లు జాయామణులఁజూచి తనయభిప్రాయ మంతయును జెప్పి
ఘనవసిష్ఠాదిమునివాక్యగరిమఁ దెల్పి, వాజిమేధంబుఁ జేయఁగ వనితలార!
దీక్షగైకొనుఁడన వారిజాక్షులధిక, హర్షమునుబొందుచుండిరయ్యవసరమున,

కం. భూకాంతునిఁ గనుఁగొని తా, నేకాంతమునందు సూతుఁ డిట్లను జనలో
కైకశరణ్యా రిపుగణ,భీకర యొకగాథ విన్నవించెద నీకున్. ౧౩౬

చ. అనఘుఁడు కశ్యపుం డనుమహాత్ముఁడు మౌనివరుండు గల్గు నా
యనకు విభాండకుం డనఁగ నాత్మభవుండు జనించెఁ బూజ్యుఁ డా
తనికిని ఋశ్యశృంగుఁ డను ధన్యుఁడు పుట్టెను భానుతేజుఁ డ
మ్మునిపతి రోమపాదుకడ మోదముతో నివసించె భూవరా. ౧౩౭

కం. ఆతని నీవు కళత్రస,మేతునిగాఁ దోడి తెచ్చి మృదువచనములం
బ్రీతునిఁ జేయుచు నధ్వర, మీతఁడె నొనరింపవలయు హితమతితోడన్.

వ. మఱియును. ౧౩౮

సీ. ఋశ్యశృంగుండు పుత్రకామేష్టి నీకుఁ
గరుణఁ జేయింప నలుగురు ఘనులు సుతులు
పుట్టెదరు సందియము లేదు భూరితేజుఁ
డగు సనత్కుమారుఁడు సెప్పె నమర నిట్లు. ౧౪౦

కం. అనవిని సూతుఁడ నేనా, ఘనమునికృప నధ్వరంబు గావింపంగాఁ
దనయులు గలుగుదురుగదా, యనఘుం బమ్ముని చరిత్ర మంతయుఁ జెపుమా.

— ఋశ్యశృంగచరిత్రము —

వ. అని యిట్లు దశరథేశ్వరుండు ఋశ్యశృంగముని ప్రభావంబు వినం గోరిన మున్ను సనత్కుమారుండు మహామునులసభలోనం దచ్చరిత్రంబుఁ జెప్పన్వింటిఁ గావున నది యెల్ల నీకెఱింగించెద సావధానుండవై యాకర్ణింపుమని సూతుం డిట్లనియె. ౧౪౧

సీ. పార్థివోత్తమ రోమపాదుం డనఁగ నొప్పు నంగదేశాధీశుఁ డధికకీర్తి
యతనిదేశంబునం దద్భుతంబుగ మున్ను వర్ష మింతయుఁ గొన్నివత్సరములు
గురియకున్ననుఁ బ్రజ లురుపీడఁ బొందిరి మృగఖగాదులకును మేఁతలుడిగె
నది యంతఁ గన్గొని యారాజపుంగవుం డతిబుద్ధిమంతు లైనట్టి మంత్రి
వరులఁ గన్గొని ధరణిని వాన లొదవఁ, బ్రాకటంబుగ రుద్రాభిషేకములను
ఘననవగ్రహశాంతులుఁ గడక విప్ర,వరులచేతను జేయింపవలయు ననుడు.

కం. మీయానతి సకలంబును, జేయించెద మధిప యొకవిశేషము గలుగున్
మాయెడఁ గృపతో విను భూ, నాయక యెఱిఁగింతు మీపు దనంత ప్రీతిన్.

చ. ఘనమతి ఋశ్యశృంగుఁ డనఁ గల్గును గశ్యపపౌత్రుఁ డాతపో
ధనమణి వేదశాస్త్రనిధి ధన్యగుణుండు విభాండకాత్మజుం
డనఘుఁడు బ్రహ్మచారి యమలాత్ముఁడు గావున నమ్మునీంద్రునిం
బనివడి తోడితెచ్చిన శుభం బగు ధాత్రిని వృష్టి గల్గెడున్. ౧౮౫

క. అన విని యా రాతనిఁ దో, డ్కొని రం డని పలుక నతనిఁ గొనిరాఁగా మా
కును వశము గాదు పణ్యాం, గనలం బనుపంగవలయు ఘనమునికడకున్.

క. వారాంగన లరిగిన న, వ్వారిజహితతేజుఁ డెన్నివరుసల నైన
న్వారలు మాయలఁ బెట్టుచు, వారక తోడ్తెత్తు రిటకు వసుధాధీశా. ౧౮౬

క. అని తెల్పఁగ భూకాంతుఁడు, ఘనముదమున నపుడె వారకాంతలఁ బిలిపిం
చి నితాంతాదరమునఁ గని, వనితామణులార! మీరు వారని వేడ్కన్. ౧౮౭

గీ. ఋశ్యశృంగాశ్రమంబున కేగి యతని, నెన్నివిధముల నైనఁ బ్రసన్నుఁ జేసి
తోడుకొని రావలయు నేఁడు చూడఁ బనుప, మీ చతురతావిశేషము ల్మెరలనియె.

మ. జననాథాగ్రణి యిట్లు పల్క మకురాస్యల్ దేవ నీయానతిం
జని యమ్ముగ్ధతపోనిధిం గనుచు నేచందంబు గావించి యై
నను దోడ్తెత్తు మటంచుఁ బల్కి మది నానందంబుతో మ్రొక్కి చ
య్యన వీడ్కొంచు మునీంద్రుఁ గానఁ బరువం బై మొత్తమై యత్తఱిన్.

సీ. అడిని మిత్రత్వ మందఱ మంది యాస్యంబుల నబ్జప్రసాద మొంది
ఘనగుణంబులను మంగళలక్షణముఁ బొంది మతినిసర్వజ్ఞతామహిమఁ దాల్చి
కుచకందుకంబుల గురుత ప్రాపించియుఁ గచపాళి కవ్వళిఖ్యల ధరించి
చరణాబ్జముల శనైశ్చరత సంపాదించి రోమరాజిని దమోమహిమఁ బూని
నుతులఁ గాంచిన నవగ్రహానుగ్రహమున, వెలయు మనకీ ప్రయత్నంబు వెసలభించు
ధర నవగ్రహదోషంబు దరలిపోవు, ననుచు సంతోషపూరితస్వాంత లగుచు.

క. పల్లవకర లై తగున, ప్పల్లవకరలుఁ దరహాస భాసురముఖు లై
తెల్లని సన్నపు వలువల, నల్లన లలరారఁ గట్టి యురుతర లీలన్. ౧౯౧

క. మంచికుసుంభారుణనవ, కంచుకములు దొడిగి రెలమి గదియఁగ దిగువం
గొంచెమురోజంబులు గను, పించఁగఁ గుచమధ్యములను బిగి ముడులలరన్.

సీ. తన్ముల మించు పాదమ్ముల బంగారు పావడాలందియ ల్పాదుకొల్పి
చిగురుటాకుల నెన్ను చేతుల రతనంపుఁ గంకణంబులు హస్తకములుఁ దొడిగి
మృగరాజు నోడింపఁ దగు నెన్నడుములందు గంటలొడ్డాణము ల్గట్టి బిగించి
కంబుబిబ్బోకంబు గల గలసీమల ముక్తికావళులను మట్టుకొలిపి

దండలను బాజుబందులుఁ దనరఁ జేసి, పరగఁ బాపటబిందీ ల్నొసళ్ళఁ గూర్చి
శిఖల నెలవంకరాగిడు ల్చేర్చి మఱియుఁ, దగినతొడవులు దాల్చి యత్తరుణు లపుడు.

గీ. మేను లలరంగ మృగమదమిళితభూరి, గంధచందన మలఁదిమఁ గన్నులందు
నంజనము దిద్ది కర్పూరరంజితము గు, విడెము గావించి నగరము వెడలి రంత.

వ. ఇట్లు వెడలి యప్పడఁతు లెడనెడ గజగజ గొణ్ణుచుండి వడివడి నడువ
నడుగులు దడఁబడ నడుగక విడివిడి నడచుచు నత్యాశపో త్రముచిత్రం బిత్త
ఱి మెత్తనచేసి తెత్తు మని తత్తఱపడి మొత్తం బైన బిత్తరులము గావున
మనవృత్తాంతంబు క్రొత్తగ విన్న వియత్తలచరులైన మెత్తురు గదా యని
పలుకుచుఁ జని చని యమ్మునితనయుం డున్న వనంబుఁ బ్రవేశించి రంత

క. అమ్మునిఁ వినుటకుఁ జిత్రక, రమ్మగుసంగీత మచట రమణులు కలనా
దమ్ముగఁ బాడిరి రాగర, సమ్ములచే ముదము మదిని జనియింపంగన్. ౧౫౮

క. ఆనాదము వినఁబడిన, గ్గానస్వన మని యెఱుఁగక ఘనతర వేద
ప్వాన మని యెంచి యమ్ముని, నూనం దరిఁజేరి వారిఁ జూచెం బ్రీతిన్.

వ. చూచి స్త్రీపుంసభేదం బెఱుఁగని ముగ్ధుండు గావున నమ్మగువల మును లని
తలంచి యర్ఘ్యపాద్యాదులం బూజించి యిట్లనియె ౧౫౯

సీ. ఓ మునీశ్వరులార మామీఁదఁ గృపచేసి వచ్చినవారు మీ వరుసఁ జూడ
దివినుండి భువికి నేతెంచినట్లులు దోఁచె మీరు గట్టిననారచీర లరయఁ
గడు నుంజుళంబులు గళముల మీరు ధరించినమాలిక లెంచఁ దరమె
ధగధగ మెఱయును దనువులు మీరుపూసినభూతి మంచివాసనల నీను
మీరు నేర్చినవేదము ల్మెచ్చఁదగ, మిమ్ము మీదర్శనమున మా కిట్టిభాగ్య
మబ్బెనని చెప్పవశమా నయహహ మీకుఁ, బూని శుశ్రూష చేయఁగా బుద్ధిపొడమె

వ. ఇట్లనేకవిధంబుల ముగ్ధాలాపంబులు పలుకుచున్న మునిం జూచి సంతుష్ట
లై తము తెచ్చిన యపూపాదిభక్ష్యంబు లతని కొసంగి తద్భక్షణంబునఁ
బ్రీతుం జేసి. ౧౬౧

క. వనితలు తమలో నిట్లను, మనభాగ్యవశంబువలన మహితాత్ముం డీ
మునివరు లని నిశ్చయించి, యనుమతి భాషించుకొనిరి హాళిదలిర్పన్.

ఉ. మక్కువ మీఱ నాతని నమస్తవిధంబుల సన్నుతించుచుం
జెక్కులు ముద్దుగొంచు నగుఁజెందఁగఁ జెన్నలిగింత వెట్టుచుం

దక్కుచు వీక్కుచుఁ దృణము తాళుచుఁ బాడుచుఁ గాఁగిలించుచుం
బక్కున నవ్వుచు న్స్తాగముపై మొగముం గదియించి పల్కుచుఁ. ౧౬౩
గీ. సరసిజేక్షణలా బ్రహ్మచారినిట్లు, పెక్కుభంగులఁ దముఁబాసి యొక్కగడియ
తాళలేకుండ మచ్చిక లగ్గ నొనర్చి, యతని వీడ్కొని తమపురికరుగుదెంచి.
వ. అమ్మఱునాఁడు పూర్వప్రకారంబునం జని తమరాక కెదురుచూచుచున్న
మునికుమారుం గని సరసమృదుమధురవచనంబులం బ్రీతుం జేసి. ౧౬౫
క. మాకోనకు విచ్చేయు ప్ర, భాకరసమతేజ యనినఁ బ్రమదముతో మీ
రాక మదిఁ గోరి యుంటిని, మీకడను మెలంగుచున్న మేలగువారుఁ.
క. అని పలుకు బుశ్యశృంగుని, వినయంబునఁ దోడుకొనుచు వేశ్యలు దమకం
బునఁ దమనగరంబునకును, జని ఘనుఁడగు రోమపాదు సన్నిధి నిడిరి.
వ. తత్క్షణంబున. ౧౬౮
క. ధరణీతలమున వర్షము, గురిసెను బ్రజపీక దొలఁగెఁ గుతుకముతో న
న్నరవరుఁడు మునికిఁబూజలు, సరగున నొనరించె సచివసహితుండగుచుఁ.
వ. అప్పుడన్నరేంద్రుం డావారాంగనలం జూచి. ౧౭౦
క. రంభోరువిలాసలు మీ, రంభోరుహచారునేత్ర లబ్జారిముఖుల్
రంభోరులు మత్తార్యా, రంభోరుతర ప్రమోదరాజితమతులుఁ. ౧౭౧
ఉ. కావునఁ దోడి తెచ్చితిరి కళ్యకపౌత్రుని నాదుచెంతకు
స్త్రీవరచాతురీమహిమ మెచ్చఁగ నేరికి శక్య మౌనె రా
జీవనిభాస్యలార! యని శీఘ్రము వీరికిఁ బారితోషికం
బీవలె నిండటంచుఁ దనయిష్టులతో నెఱిఁగింపఁ గ్రక్కునన్. ౧౭౨
క. వారటు సేయఁగ రహిన, వ్వారవిలాసినులు మనుజవల్లభుదండం
జేరి తదాజ్ఞం గైకొని, వారక నెలవులకుఁ జనిరి వైభవ మొప్పన్. ౧౭౩
వ. తదనంతరంబ. ౧౭౪
చ. వరుఁడగురోమపాదజనవల్లభుఁ డమ్మునికిచ్చెఁ గూఁతు భా
సురగుణకాంత శాంత నతిశుద్ధవసాంబరభూరిభూషణా
దరను దరోల్లసద్గళ నుదారచరిత్రను గుందదంతఁ దా
మరసముఖి న్మృగేంద్రతనుమధ్య విసారనిభాక్షి సద్విధిన్. ౧౭౫
క. మహిమాన్వితుఁడై తగున, మ్మహిపతి తనయింట మునిచె మన్ననతో న
ద్దుహితను జామాతను దన, దుహితముకై లోకసన్నుతులు దాఁగన్గుచుఁ

క. ఆరాజు దత్త్వపాదం, బాహూఢికఁ గాంచి కాంచనాచలధీరుల్
శూరు లుదారులు నైనను, మారులఁగని యున్న వాఁడు మహితోత్సవుఁడై.
లోదకవృత్తము. కావున వేగముగాఁజని నీవ,బ్బావరునింగనిపొందుగ నా కాం
తావరుఁ దెచ్చి ముదంబున యాగం, బావరమానిదయుం దగుఁ జేయున్.

సీ. అవనీశ ఋశ్యశృంగాభిధానమునీంద్రుఁ డధ్వర్యుఁడుగ యాగ మాచరింపఁ
గొడుకుల నీ విఁకఁ బడసెద వనుచు సూతుండు సనత్కుమారుండు సెప్పి
నట్టి రహస్యంబు గట్టిగాఁ జెప్పిన దశరథుం డాశ్రోఁ దవరి తనదు
గురు వసిష్ఠుని దోడుకొని వచ్చి పూజించి యతని కీవృత్తాంత మంత దెల్పి
తదనుమతి గొని రోమపాద ప్రజాధి,పతిపురంబున కరుగంగఁ బయనమగుచు
మంత్రి ముఖ్యుల కెఱిఁగించి మాన్యలీలఁ, జెలఁగి ప్రస్థానభేరి ఘోషింపఁజేసి.

వ. మఱియు మాతంగ తురంగ శతాంగ పదాతి ప్రముఖబలసమేతుం డై పాం
డురచ్ఛత్రచామరాది చిహ్నంబులు మెఱయఁ బురంబు నిర్గమించి యెడనెడ
గ్రామంబులు వనంబులు మహానదు లాదిగాఁ గలుగువని యెల్ల నతిక్రమించి
కతిపయదినంబులకు నంగదేశంబు సొచ్చి తద్రాజధానిం బ్రవేశించి యచ్చట
ఋశ్యశృంగమునిదర్శనపూర్వకంబుగా రోమపాదుం జూచి యిట్లనియె.

క. భూనాయక నీచెంగటి, కే నొక కార్యంబుగలిగి యేతెంచితి న
న్నానమున నన్నుఁ గని నా, పూనిక నెఱవంగవలయు బుధు లగ్గింపన్.

గీ. అనిన దశరథువచనమ్ము లాలకించి, రోమపాదుండు సంతతసాధుకీర్తి
యానతిండనఁ దనమదియందునున్న, కోర్కి దెలుపంగ నారాజకుంజరుండు.

వ. అట్లగుంగాక యని యద్దశరథేశ్వరు నతివినయసంభాషణంబుల సంతుష్టుం
జేసిన నతం డమ్మునిం జూచి. ౧౮౩

క. నీదర్శనమున నా కతి,మోదము వాటిల్లె సకలమునినుత నిలవ
ద్వేదాధ్యయనరతా సుజ,నాదర శాంతావరా కృతార్థుఁడ నైతిన్. ౧౮౪

వ. ఇట్లనేకప్రకారంబుల స్తుతియించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి
యమ్ముని ప్రసాదంబు వడసి యచ్చోటఁ గొన్నిదినంబు లుండి యొక్కనాఁడు
రోమపాదుం జూచి. ౧౮౫

క. జననాయక మానగరికిఁ, బనివినియెడఁ గాక నీదుపట్టిని శాంతన్
ఘనుఋశ్యశృంగు నాతోఁ, బనుపంగావలయు ఘనకృపామతి వగుచున్.

చ. అన విని రోమపాదవసుధాధిపుఁ డల్లునిఁ గూఁతుఁ జూచి మీ
రనువుగ నిమ్మహారథుని యందుఁ గృపామతిఁ జేసి యివ్వ డి

తనిపురి కేఁగఁగావలె హితం బిది నా కని తెల్ప నట్టులే
చనియెద మంచు వారు గను సమ్మదవృత్తిఁ జెలంగి రయ్యెడన్. ౧౮౭

క. ఆదశరథభూనాథుం, డాదంపతులకు సువాహనారూఢత సం
పాదించి నెమ్మదిని గడు, నాదరమున రోమపాదు ననుమతి గొనుచున్.

ఉ. ఆపురి నిర్గమించి సుబలాన్వితుఁ డై సకళత్రుఁ డైన య
త్తాపసు వెంటఁ బెట్టుకొని తామరసప్రియవంశసంభవుం
డాపగలు న్వనంబులు నహార్యములుం గఁత్రోవ దాఁటి తా
నోపికతోడుతం దన యయోధ్యసమీపముఁ జేరి యంతటన్. ౧౮౯

క. తనరాక పౌరజనులకుఁ, బనివడి చెప్పుమని యొక్క పరిచారకునిం
బనిచిన వాఁ డటు సేయఁగ, విని పౌరులు మనము లలర వీథులయందున్.

గీ. అమితచూతపల్లవతోరణములు గట్టి, కలితచందనహిమజలంబులను జల్లి
ముత్తియంబులు మ్రుగ్గిడి లత్తరమున, బురము గైసేసి రంత సద్ధరణివిభుఁడు.

శా. భేరీశంఖమృదంగకాహళల గంభీరధ్వను ల్భాసురా
శీరాళిస్ఫుటనాదముల్ చెలఁగఁగా సీమంతిను ల్వక్ష సిం
గారం బొప్ప నివాళు లీయ గణిక ల్గానంబు గావించి కై
వారంబుల్ దగఁ జేయఁ బట్టణము తేవం జొచ్చె నింద్రుండనన్. ౧౯౨

వ. ఇట్లు పురంబు ప్రవేశించి. ౧౯౩

క. తనగృహము సొచ్చి జనపతి, వనితాయుతుఁ డైనమునియువలనుగఁ దనతోఁ
జనుదేర జనము లందఱు, మనముల హర్షించి మిగుల మన్నింపంగన్. ౧౯౪

గీ. పిదప నమ్మునిఁ బూజించి ప్రియముతోడ, దశరథక్షితినాథుఁ డుదారకీర్తి
తదనుమతి గొనియాలతని ధర్మపత్ని, శాంత నంతటఁ బనిచె శుద్ధాంతమునకు.

క. అశాంత వినుతగుణ యగు, నాశాంతాహ్వయ సుదంత యతిరమణీయా
కాధునీకాశవసీ,కాశలసత్కీర్తి మందగమనముతోడన్. ౧౯౬

క. ఇంతులు దన చెంతలఁ గడు, సంతసమున వచ్చుచుండ సవినయముగ శు
ద్ధాంతమున కేఁగఁగా న,క్కాంతకు నెదు రరిగి రాజకాంతలు ప్రీతిన్. ౧౯౭

క. కొమ్మా రమ్మా యమ్మా, సమ్మానితచరిత పరమసంయమిముద్దుం
గుమ్మా నుతిగ్రకొమ్మా, యిమ్మా భద్రములు మాకు నింపు దలిర్పన్.

క. అని తోడి తెచ్చి కనకా, సనమునఁ గూర్చుండఁ జేసి సరసిజనేత్రల్
వినయమునఁ బూజసేయుచు, వినతింపఁగ మనమునందు వేడుకపొడమన్.

లయగ్రాహి.

శాంత ఘనదాంత వరకాంత నిగమాంత విద
  నంత నిధసంతతసుచింతమునికాంతా
కాంతతను కాంతియుతచింతితనితాంతశుభ
  దంతిగతిసంతమసకుంతలసుదంతా
యింతి యిది యింత పతిపొంతగదకింత గజ
  రింతువు నిరంతరదిగంతసదుదంతా
యెంతని వచింతుము వలంతులను కొంతయు గ
  జెంత నినుఁ జింతుమని యొంతుము నెలంతా. ౧౦౦

క. ఇటు సన్నుతించుచును మౌని, కుటిలాలక కెదను మోదము గూర్పఁగఁ దమయం
తటఁ గావలసిన పనులను, ఘటియించిరి సమ్రభావగతమతియుతలై.

వ. ఇట్లు దినదినం బమ్ముని దంపతులకు దశరథుండు భార్యలుం దానును భవిశేష కల్పిత పరిచర్యలు సలుపుచుండఁ గొంతకాలంబునకు సతనిపాలిభాగ్యదేవతచందంబున వసంతసమయుం బరుదెంచిన. ౧౦౧

—। వసంతర్తువర్ణనము ।—

సీ. పండుటాకులు క్రిందఁ బడవైచి మామిళ్లు గుజ్జుకెంజాయచిగుళ్లు దొడిగెఁ
జిగురాకులను మెక్కి చెలఁగి కొమ్మలనెక్కి కోయిలదండము ల్గాయఁదొడఁగెఁ
బుష్పఁదేనియలాని పొలుపరు తుమ్మెదల్ హాయిగా గానము ల్సేయసాగె
మమ్మఁజూడఁగావచ్చు మదనుఁడిచ్చటికన్న చెలువునఁ జిలుకలు పలుకఁజొచ్చె
నించువిల్కాని బలములో నెంచ మమ్ము, మించువారేరియని మెచ్చుకొంచునున్న
కరణిఘనబర్హిణములు కేకలను మించె, నవ్వసంతాగమంబున నఖిలవనుల.

గీ. ధరణిఁ గొందఱు సుజనులు దారలీల, సుందరులఁ గూడి మనములానందమొంద
బహుళకల్పవకుసుమితఫలితవనుల, యందు విహరించుచుండిరయ్యవసరమున.

క. నిండు కొనపండు వెన్నెల, యుండఁగఁ జకములు కుహూకుహూయించు రోదల్
దండిగఁ జేయఁగఁ బాంథులు, గుండియలదరంగ మూర్ఛ గొని రారేలన్.

వ. అట్టి నిశాసమయంబులందు. ౧౦౪

చ. వఱలు వసీవసంతులు వివాహమహోత్సవమందుచుండ న
త్రలిజయనుబాణకారి ప్రమదంబునఁ గాల్చిన చిచ్చుబుడ్ల బల్
మెఱపుల పిండులో యనఁగ మించెఁ దలిర్చిన మావులందు పై
నొఱఁగు పికాళులు కోకిలాళులు సమున్నతధూమములో యనం దగెన్. ౧౦౫

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా
వారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు. (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గోడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. యల్.

ఆకెళ్ల వేంకటాప్రమయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

# కాకినాడ—ఆంధ్రసాహిత్యపరిషత్తులో వెలకుదొరకు గ్రంథములు.

| | | రు | |
|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | 0 | 8 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... ... | 0 | 10 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తార్కిక పెదతిరుమలార్యుఁడు ... ... | 0 | 2 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు ... | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టుసర్వశాస్త్రికవి ... ... | 0 | 2 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... ... | 0 | 2 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుగారు ... | 0 | 8 |
| 9 | కావ్యాలంకారచూడామణి- విన్నకోట పెద్దయకవి ... ... | 0 | 8 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... ... | 1 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... ... | 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 12 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... ... | 0 | 12 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు ... | 0 | 8 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 8 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు ... | 0 | 4 |
| 18 | ప్రాస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు ... ... | 0 | 8 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు ... ... | 1 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ ... ... | 0 | 8 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁడుఁడు ... | 0 | 12 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి ... | 1 | 4 |
| 23 | రెడ్డినాఁటి రెండుశాసనములు ... ... | 0 | 4 |
| 24 | ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి ... ... | 0 | 12 |
| 25 | శాసనపద్యమంజరి ... ... | 0 | 12 |
| 26 | శతకసముచ్చయము (1-2 భాగములు) ... ... | 1 | 6 |
| 27 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) ... ... | 0 | 8 |
| 28 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయసూరి ... ... | 0 | 8 |
| 29 | రసాభరణము—అనంతకవి. ... ... | 0 | 8 |
| 30 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) ... ... | 0 | 8 |
| 31 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు ... | 1 | 0 |
| 32 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ ... ... | 0 | 8 |
| 33 | అమరుకము-సాంధ్రము-జయంతి రామయ్యపంతులుగారు ... | 1 | 0 |
| 34 | సాంబోపాఖ్యానము-రామరాజురంగప్పరాజు ... ... | 1 | 0 |
| 35 | హంససందేశము-కిల్లారి వేంకటరామశాస్త్రిగారు ... ... | 0 | 2 |
| 36 | సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి ... ... | 0 | 10 |
| 37 | రాజవాచకము ... ... | 0 | 8 |
| 38 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతికృతాంధ్రటీకాసహితము ... | 0 | 8 |

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.